# గీతాసిద్ధాంతము



రచన:

ఆరిమల్లి సుబ్బారెడ్డి

# గీతాసిద్ధాంతము

రచన:
ఆరిమళ్ళ సుబ్బారెడ్డి

B

ప్రథమ ముద్రణ
డిశంబరు 60

వెల రు. 1-50 న. పై.

పుస్తకములు దొరుకుచోటు:—
ఆనుమల్ల కోటిరెడ్డి, డ్రిల్లుమాష్టర్,
శ్రీ రామా హైస్కూలు
తేలప్రోలు P. O.
(కృష్ణా జిల్లా).

శ్రీ బాలాజీ ప్రెస్.
నత్తెనపల్లి.

D

# విషయసూచిక

—:o:—

TPLA107B199



# ఉపోద్ఘాతము

---

శ్రీ మద్భగవద్గీత యే అమృతఘడియలలో పుట్టినదో చెప్పలేము గాని, హిందూసమాజములో దీనిస్థానము అసమానమై అజరామరమై, మహోన్నతమైన స్థిరస్థాయిని చెందినది. ఒకప్పుడు వేదసమ్మతముగాని మతమునకు అదెంతటి ప్రాముఖ్యతను జెందిన దైనను హిందూసమాజములో దానికి స్థానములేదు. అట్టి మహోన్నతమైన వేదముయొక్క స్థానమును తాను జన్మించిన మరుక్షణములోనే ఆక్రమించుకొని, తనదు సమ్మతము గాని సిద్ధాంతమును, అదెంతటి ప్రభావము గలదిగాని, హిందూసమాజమంగీకరింపజాల నంతటి పరమప్రమాణ గ్రంథముగా గీత స్థిరపడినది.

అందుచేతనే జగద్గురు శంకరాచార్యులవారి దగ్గరనుండి, వినోభావేగారి వరకు, హిందూసమాజములో జన్మించిన ఆధ్యాత్మిక, రాజకీయవేత్తలెల్లరును తమసిద్ధాంతములు గీతాసమ్మతమైనవే యని తప్పనిసరిగ ఋజువు చేసికొనవలసివచ్చినది. నిజమునకు శ్రీ శంకరాచార్యులవారు అద్వైతి, శ్రీరామానుజులవారు విశిష్టాద్వైతి, శ్రీ మధ్వాచార్యులవారు ద్వైతి. అంతమాత్రమేకాదు, వారిలో మొదటివారిది జ్ఞానమార్గము రెండవవారిది భక్తిమార్గము, మూడవవారిది కర్మమార్గము అదేవిధముగా,

రాజకీయ నాయకులలో కూడ కావలసినన్ని భేదములు గలవు. ఉదాహరణకు ఆతతాయిలను చంపవచ్చుననునది, తిలకుగారి వాదము. ఆతతాయిలను సైతము చంపరాదనియు ధనికులు తమ ధనమునకు తామే ధర్మకర్తలుగా వుండి త్యాగము చేయవలయుననునది గాంధీగారి వాదము. తనకు కావలసినదానికంటె మించినదానిని సమాజమున కివ్వకపోవుట మహాపాపమనునది వినోభావేగారి వాదము. అయినను వీరెల్లరు కూడ గీత తమ వాదమునే సమర్థించినదని ఋజువుచేసుకొనుటకై, తలకొక భాష్యమును వ్రాయవలసివచ్చినది. దీనినిబట్టియే, హిందూ సమాజములో గల మతగ్రంథములలో గీతకు గల ప్రాముఖ్యత, స్పష్టపడుచున్నది.

ఈ సందర్భములో నొక ప్రశ్న కలుగుట సహజము. అదేమనగా, పరస్పర వ్యతిరేక దృక్పథములు గల భాష్యకర్తల వివిధ సిద్ధాంతములలో యే సిద్ధాంతము గీతాసమ్మతమైనదను ప్రశ్న కలుగుట సహజమేకదా? ఈ ప్రశ్నకు సూటిగా సమాధానము చెప్పుటకు మేధావులు సైతము వెనుకంజ వేయుచున్నారు. కారణమేమనగా ప్రతి భాష్యకర్తయు తన సిద్ధాంతమునే గీతాకారుడు అక్షరశః అంగీకరించినట్లు శతవిధముల వేలాది ప్రమాణములతో ఋజువుచేయుచు వచ్చినారు. అట్టివారిలో మతస్థాపకులైన శ్రీశంకర రామానుజ మధ్వాచార్యులవారివంటి ఆచార్యపురుషులుగాని, ఆధ్యాత్మికముగనేగాక రాజకీయముగ కూడ మహానాయకులైన తిలక్, అనిబిసెంటు గాంధీ, వినోభావేలవంటి మహానుభావులుగాని అనేకులు గలరు గదా? వీరిలో ప్రమాణపురుషులు కానివారెవ్వరు! యిందులో ఎవరి సిద్ధాంతమును కాదనగలము? ఆ కారణముచేతనే ఈ విషయము పరిష్కరింపరాని జటిల సమస్యగా నిలచిపోయినది.

భాష్యకారులు మహామేధావులైనంతమాత్రమున వారు చెప్పిన పరస్పర వ్యతిరేకములైన సిద్ధాంతములన్నియు, గీతాసమ్మతములైనవే

నని అంగీకరింపజాలముగదా? ఆ పరిస్థితులలో మన మే భాష్యకర్త ననుసరింపవలసియున్నది? యేదో ఒక గుడ్డినమ్మకముతో, ఎవరినో నొకరి ననుసరింపవలసినదేనా? అట్టి అంధానుకరణము అధోగతికి దారితీయునని మహాపురుషులెల్ల రేకగ్రీవముగ హెచ్చరికచేసియేయున్నారు గదా? దీనినిబట్టి సత్యాన్వేషణము ద్వారా అనుభవ పూర్వకముగ తెలుసుకొనబడిన ఋజుమార్గము ననుసరించుటే మానవులై జన్మించిన ప్రతి ఒక్కరి విద్యుక్త ధర్మమని స్పష్టపడుచున్నది. ఈ కారణము చేతనే విద్యా శూన్యుడనయ్యును, గీతాసిద్ధాంతమును తెలుసుకొనుటకై కొన్ని సంవత్సరములుగా పరిశోధన సాగించితిని. ఆపరిశోధనా ఫలితమే నేడు మీచేతులలోనున్న ఈగీతా సిద్ధాంత గ్రంధము. యిందలి మంచి చెడ్డలను నిర్ణయింప వలసినబాధ్యత విజ్ఞులైన పాఠకులపై నున్నదని మనవి చేయుచు, నేనీగీతా వ్యాఖ్యానమును చేయుటకుగల ముఖ్యకారణములను పాఠకులకు సంగ్రహముగ తెలియజేయుటకై ఈ ఉపోద్ఘాతమును వ్రాయుచున్నాను.

క్షుద్రజీవి మొదలు అగ్రజీవివరకు జేయు ప్రతిసంకల్పమును, తమ సుఖశాంతులకొరకేనను విషయము ప్రతివారికిని అనుభవములోనిదేగదా? యింక మానవ జాతినిగురించి ప్రత్యేకముగా చెప్పవలసినదేమున్నది? హిందూసమాజములో సుఖశాంతుల నన్వేషించుటకై బ్రాహ్మణులను పేరుతో ప్రత్యేకమొక వర్గమునే విభజించినారుగదా? ఒక్క భారత దేశములోనే ననేల? ఈవిధముగా నేలనాలుగు చెరగులనుండి ఎందరో మేధావులు లేక ప్రవక్తలు, మానవ సమాజము నిత్య సుఖానుభూతిని పొందుటకుగల మార్గములను కనిపెట్టి ప్రచారములో పెట్టకపోలేదు. కాని దురదృష్ట వశమున నాయామార్గములన్నియు, పరస్పర వ్యతిరేక మత సిద్ధాంతములుగా రూపొంది. మానవ సమాజములో మరింత చీలికలు, కల్లోలములు, అశాంతి, రక్తపాతములు కలిగించుటకు దారితీసినదేగాక

కట్టకడకు రెండుసిద్ధాంతములుగా యేర్పడి మానవసమాజమును రెండుగా చీల్చివైచినవని ప్రపంచ చరిత్రియే స్పష్టము చేయుచున్నది. ఆరెంటిలో నొకటి భౌతికసిద్ధాంతమును మరొకటి ఆధ్యాత్మిక సిద్ధాంతమును స్థాపించుటకై నాటినుండి నేటివరకు విశ్వప్రయత్నములు చేయుచున్నవని వేరుగ చెప్పనక్కరలేదుగదా ?

అందు భౌతికవాదులవాదమిది. సకలదుఃఖములకు మూలము దరిద్రతే. దానికి కారణము సోమరితనము. దాని ఫలితము దేశపరాధీనత. దాని అనుభవము శాశ్వితజానిసత్వము. దానికి మూలము మతము. "బ్రహ్మనిత్యం జగత్‌మిథ్య" అను జగత్‌మిథ్యాద్వైతవాదమును, మరియు, శుభాశుభములకు దైవమే కర్తయను దైవ వాదమును మానవుని దృష్టిని ప్రత్యక్షఫలితములిచ్చు ప్రపంచమువైపునుండి ఆకాశము వైపునకు మళ్లించినవి. శతాబ్దములుగా హిందూ సమాజమునే కాదు, మానవసమాజమునే అధోగతి మార్గములో నడిపించిన దీ మతమే నని వీరి వాదము.

ఇక రెండవ వారివాద మిది— జగత్తుమిథ్య. జీవిత మస్థిరము. విషయవాంఛలు దుఃఖమూలములు ఆశకు అంతులేదు సకలసంపదల కాల వాలమైనవని చెప్పబడు అమెరికావంటి దేశములు సైతము వారి సంపదను కాలమును శక్తిని మారణయంత్ర నిర్మాణములకొరకై యేల వృధా చేయుచున్నారు ? దురాశ చావకనేగాని తిండికి చాలకకాదుగదా ? దీనిని బట్టియే భౌతికవస్తు సముదాయములు సుఖశాంతులను కలిగించుననుకొనుట శుద్ధ అవివేకమనియు, వివేకియైనవా డీ దుఃఖమయ జగత్తునకు దూరముగ నుండవలయునని స్పష్టపడుచున్నదనియు వీరు వాదించెదరు. ఒకరి విశ్వాసము మరొకరికి సుతరాం గిట్టదు. వేదాంతుల దృష్టిలో భౌతిక వాదులు అజ్ఞానులు, ఆశబోతులు, భోగలాలసులు. అదేవిధముగా భౌతిక వాదుల దృష్టిలో వేదాంతులు, అవివేకులు పరాన్నభుక్కులు, పరమ

సోమరులు. వీరివురి సిద్ధాంతములకు తూరుపు పడమరల కున్నంత దూర మున్నది. వీరిలో ఎవరివాదము సత్యము? ఎవరి దసత్యము?

వేదాంతుల వాదమును భౌతికవాదు లీ విధముగ ఖండించెదరు. "స్వస్థచిత్తే బుద్ధయస్సంభవంతి" అను నార్యోక్తి వేదాంతులదేగదా? దీని అర్థ మేమిటి? వేదాంతానుభవమును పొందుటకు స్వస్థచిత్తము కావలయుననియేగదా దీని అర్థము? చిత్తమన్నను మనస్సన్నను ఒక్కటే గదా! మనస్సు దేనివల్ల కలుగుచున్నదను ప్రశ్నకు అన్నముయొక్క సూక్ష్మాంశమే మనస్సనిగదా తత్త్వజ్ఞుల నిర్ణయము? (1) దీనినిబట్టి యేది ఎందుండి కలిగినదో అది దాని ఆధారముతోనే నిలువగలుగునను న్యాయము ననుసరించి మనస్సు నిలుచుట కన్నమవసరమనియే స్పష్టపడు చున్నదిగదా? అన్న మెచ్చటినుండి కలుగుచున్నది? జగత్తునుండియే గదా? జగత్తే మిథ్య యైనచో అన్నమెచ్చటనుండి లభించును? అన్నమే లభింపనిచో చిత్త మెట్లు స్థిరమును పొందును? యింత స్పష్టముగ కనిపించు ప్రత్యక్ష సత్యమును నిరాకరించి జగన్మిథ్యావాదమును చేయువారు పశుతుల్యులు గాక ప్రజ్ఞావంతు లెట్లగుదురని వీరు వాదించెదరు.

ఇక వేదాంతులవాదమిది. భౌతికవాదుల వాదములో సత్యమున్నచో అన్నపానాదులు పుష్కలముగ నున్న శ్రీమంతులు సుఖశాంతుల ననుభవింపవలయునుగదా! అట్లు జరుగుట లేదనునది మన కెల్లరికి అనుభవములో తెలిసినవిషయమే కాబట్టి సుఖశాంతులకు భౌతిక సంపత్తి యనబడు అన్నపానాదులు ముఖ్యములు కావనియు ఆధ్యాత్మికానుభూతి యొక్కటియే నిజమైన శాంతిమార్గమనియు వీరు వాదించెదరు.

నిజమునకు ఈ రెండువాదములలోను సత్యము లేకపోలేదు. భౌతిక సంపత్తి అనగా అన్నపానాదులు లేకున్నచో దేహములు నిలు

---

(1) అన్నమయంహి సోమ్య మనః

వవు. అట్లే వివేకజ్ఞానము లేకున్నచో హృదయశాంతి శూన్యమగును. కాబట్టి పై రెండు సిద్ధాంతములను ఆచరణలో పెట్టగలిగినప్పుడే మానవుని యొక్క సుఖశాంతులకు సంపూర్ణత చేకూరగలదని చరిత్ర వేనోళ్ల చాటుచున్నది. కాని ఈ సమన్వయమార్గమును అనుసరించుట కాయిరు కక్ష్యలవారిలో యే ఒక్కరుకూడ అంగీకరించరు. ఈ అనైక్యతవల్ల హిందూసమాజమునకు కలిగిన నష్ట మింతయని చెప్ప నలవికాదు. ఒక్క హిందూ సమాజమే నననేల? ఈ వ్యతిరేకసిద్ధాంతముల సంఘర్షణ లవల్ల దేశము, దేశనాయకులుకూడ నామరూపములు లేకుండ నశించి పోయిన ఘటనల నెన్నిటినో చరిత్ర ఎత్తిచూపుచున్నది.

ఈవిధముగా పరస్పర విరుద్ధములైన మతసిద్ధాంతములవల్ల సమాజ మెంతటి అధోగతిని పొందుచున్నను మతవాదుల మనస్సులు మాత్రము మారలేదు. జగత్తు మిథ్యయని నమ్మిన వేదాంతుల దృష్టిలో దేశపరాధీనతగాని బుద్ధ శంకర దయానంద గాంధీజీ మొదలగు మహా పురుషుల హత్యలు గాని మానసిక భ్రాంతివల్ల కలిగిన స్వప్నదృశ్యము లుగా పరిగణింపబడినవి. అదేవిధముగ ఆర్థికాభివృద్ధియే అన్నిసమస్యల కు పరిష్కార మార్గమని నమ్మిన భౌతిక వాదుల దృష్టిలో బుద్ధ, ఏసు, శంకరాచార్య, గాంధీ వినోభావే మొదలగు దివ్యపురుషుల పరమోప దేశములు, ఆచరణసాధ్యములుగాని అనవసరప్రసంగములుగా పరిగ ణింప బడినవి. ఈకారణముగ మానవజాతి బ్రతు కధోగతి పాలయినది.

జాతిరక్షణమునకై శతాబ్దములుగా ఎన్నోప్రయత్నములు చేసిన మహనీయులు లేకపోలేదు. కాని వారిప్రయత్నములకు బూదిలో పడిన నేతిగతి పట్టినది. దీనికి కారణమేమిటని ప్రశ్నించుకొన్నచో, పరస్పర విరుద్ధవాదములతో కూడిన వివిధమతములకైక్యత కలుగనంతవరకు హిందూసమాజమునకేకాదు, మానవజాతి మనుగడకే స్థానములేదని స్పష్ట

మైన సమాధానము వచ్చును. ఈ విధముగా మతముల పేరిట మానవుని మానవత్వమే మంటకలసి పోవనున్నతరుణమున వివిధమతసిద్ధాంతముల కైక్యత చేకూర్చుటకై ముందుకు వచ్చినవాడే శ్రీకృష్ణుడు. ఆయన సూచించిన రాజీమార్గముచే గీతాప్రబోధములు. గీతాకారు డిరుకక్ష్యలుగ నిలచి పోరాడు కొనుచున్న భౌతిక అధ్యాత్మికవాదులయొక్క పరస్పర భిన్నములైన రెండు సిద్ధాంతములను కాదనలేదు. కాని అందులో యే ఒక్క సిద్ధాంతవాదిగాని, రెండవ సిద్ధాంతము నంగీకరించి ఆచర ణలో పెట్టకపోయినచో అతడు సుఖశాంతులను పొందలేడనుటలో అణుమాత్రము సందేహములేదని మాత్రము హెచ్చరించినాడు.

గీతావాదమిది. తత్త్వపరిశీలనాజ్ఞానము 'లేని కేవల కర్మత్వము అనగా భౌతిక సంపత్తి నభివృద్ధి చేయుటయే జీవితపరమావధి యను కొనుట పశుత్వమనియు, అట్లే భౌతిక సంపత్తితో సంబంధములేని కేవల తత్త్వజ్ఞానముతోనే ఆత్మశాంతి లభించుననుకొనుట అంధత్వమనియు నిరూపించినది. అనగా ఆహారవిహారాదులకు సంబంధించిన భౌతిక సంపత్తి లోపించినచో అభ్యుదయము అనగా దేహారోగ్యము నిలచు టసంభవమనియు అట్లే తత్త్వపరిశీలనాజ్ఞానము లోపించినచో నిశ్శ్రేయ సము అనగా హృదయశాంతి లభించుట దుర్లభమనియు దాని సిద్ధాంతము దీనినిబట్టి గీతాకారుడు జ్ఞానశూన్యమైన కార్యకలాపముల నంగీకరించలే డనియు అట్లే కర్మత్యాగముతోగూడిన తత్త్వజ్ఞానమునుకూడ నిరశించినా డనియు స్పష్టపడుచున్నదిగదా? ఆయనకోరునది "జ్ఞాన - కర్మల సమ న్వయము." "ఆత్మ-విశ్వముల సమ్మిశ్రమము." "జ్ఞాన-విజ్ఞానముల యేకీ కరణ." అందుచేతనే గీతాకారుడు "జ్ఞాన-విజ్ఞాన సహితమ్" అనియు, జ్ఞాన - విజ్ఞాన తృప్తాత్మా" అనియు ప్రబోధసమయములో మాటిమాటికి వెలుగెత్తి చాటినాడు. దీనినిబట్టి "జ్ఞాన-విజ్ఞానములను" సమన్వయము చేసి ఆచరణలో పెట్టగలిగినప్పుడే మానవులకు సుఖశాంతులు లభించగలవని

గీతాకారుని నిశ్చితాభిప్రాయమని స్పష్టపడుచున్నదిగదా? అందువలన జ్ఞాన - విజ్ఞానములన నేమియో చూతము.

## జ్ఞాన — విజ్ఞానములు

గీతా వ్యాఖ్యాన కర్తలలో జ్ఞాన - విజ్ఞానములను పర్యాయ పదములుగా నుపహరించిన వారనేకులు గలరు. అట్టి గీతా వ్యాఖ్యానముల సహాయముతో గీతాకారుని నిజాభిప్రాయమును తెలిసికొన గోరుట ఎండమావులలో దాహశాంతిని జేయగోరుట వంటిదేనననిన అతిశయోక్తి కానేరదు. ఎందుచేతననగా "జ్ఞాన - విజ్ఞానములను" పదములను గీతాకారుడు పర్యాయపదములుగ ప్రయోగించ లేదు ఫిజిక్సుకు (పదార్థ విజ్ఞానశాస్త్రము) కెమిష్టిరీకిని (రసాయనశాస్త్రము), ఫిలాసఫికి (తత్వశాస్త్రము) సైన్సునకును (విజ్ఞానశాస్త్రము), థీయెరిటికల్ నాలెడ్జికి (సైద్ధాంతిక జ్ఞానము) ప్రాక్టికల్ నాలెడ్జికిని (అనుభవజ్ఞానము). తటస్థముగను వ్యవహారమునకును యే భేదము కలదో ఆభేదమే జ్ఞాన - విజ్ఞానములకును కల దనియు వస్తువుయొక్క గుణస్వభావ మిట్టిదని తెలియుట జ్ఞానమనియు ఆ వస్తువు నుపయోగించుటద్వారా పొందెడి అనుభూతిని విజ్ఞానమనియు చెప్పబడునని గీతాకారుని నిర్వచనము. అనగా. పాటను పాడుటయొక్క విధానము నెరుగుటను జ్ఞానమనబడుననియు, ఆపాటను పాడుటద్వారా పొందెడి అనుభూతిని విజ్ఞానమనబడుననియు దీని సారాంశము.

ఈ నిర్వచనమునుబట్టి ప్రపంచముయొక్క మూలతత్త్వ మిట్టిదని తెలుసుకొను తెలివిని జ్ఞానమనబడుననియు, ప్రపంచ వ్యాపారములలో పాల్గొనుచు తద్వారా పొందెడి అనుభూతిని విజ్ఞానమనబడుననియు నిర్ణయింపవలసియున్నది. కాని ఈ నిర్ణయమును వేదాంతు లంగీకరింపరు. వారి వాద మిది. దేహము నిలుచుటకు భౌతికసంపత్తి యొక్క అవసర మున్నను నిజమైన వేదాంతి వానికొఱకు ప్రయత్నింపడనియు, ఎందు

చేతననగా ఈ నశించు దేహములయొక్క రక్షణమునకై వివేకియైనవా డెవ్వడుగాని, తనకాలమును వ్యర్థము చేయడనియు జ్ఞానమొక్కటియే త్రికాలాబాధ్యమైనదికాబట్టి జ్ఞానార్జనముకొరకే వేదాంతి తనకాలము నంతయు వినియోగించుననియు అతడు వాదించును.

ఈ వాదమును పామరుడు సైతమంగీకరింపడనియే మా అభిప్రాయము. ఎందుచేతననగా పనికి సోమరియైనవాడు ప్రపంచమునకే దొంగ యను సామెత ననుసరించి పనికి దూరముగ నుండువాడు ప్రజ్ఞాహీనుడనియే చెప్పవలసియున్నదిగదా? ఒకవేళ ప్రపంచ వ్యవహారములను వదలి వైచి యేకాంతజీవితమును గడపువాడే జ్ఞానియని వేదాంతి వాదించినచో వ్యవహార బాధ్యతలను ఉద్యోగుల పరముజేసి ఉద్యానవనముల మధ్య గాలికొరకై కట్టించుకొన్న విశ్రాంతి మందిరములలో యేకాంతవాసము చేయు సోమరులను సైతము జ్ఞానులని నిర్ణయింపవలసినదేగదా?

ఇంతకును కార్యకలాపములు బంధ కారణములు కావని యెరిగిన వేదాంతియే లోక వ్యవహారములకు భయపడి సమాజమునకు దూరముగ తొలగిపోయినచో యిక సామాన్యుల గతియేమిటని మా ప్రశ్న? మావాద మిది. వ్యవహారరీత్యా కృంగి కృశించుచున్న సామాన్య ప్రజానీకమునకు ధైర్యమును కలిగించుటకై సుఖ దుఃఖములకు కారణము మనస్సే గాని, జడములైన కార్యకలాపములు కావని ప్రబోధములు చేయుచు వారితో పాటు తాముకూడ కార్య రంగములో ప్రవేశించుటయే జ్ఞానియొక్క ప్రధా నకర్తవ్యమని మాఅభిప్రాయము. ఈవిషయములో గీతాకారుదేమి చెప్పు చున్నాడో చూడుడు.

నాకు ముల్లోకములలో దేనిని గాని,పొందవలసినది లేకున్నను,నేను నిరంతరము కర్మలలో పాల్గొనుచున్నాను (3-22) నేనే కర్మలలో పాల్గొ నక పోయినచో గౌరవ నీయులైన శ్రేష్ఠపురుషులు పని చేయరాదను

భావము సమాజములో స్థిరపడి సర్వులూ పనులను మానివై చెదరు(3-22) గీతాకారుడింత స్పష్టముగ నిరూపించుచుండగా జ్ఞానులైనవారు కర్మలలో పాల్గొనరాదని వాదించుటయేగాక తాము సుఖజీవనము చేయుట కెవ్వరు కర్తలో అట్టిగృహస్థులనే అజ్ఞానులనుటకంటె దారుణమైన నిర్ణయము మరొక టుండబోదనియే మా అభిప్రాయము. మిథ్యాద్వైతి వాదమిది.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చమానవః
ఆత్మన్యేవ చసంతుష్ట స్తస్యకార్యం నవిద్యతే. 3-17

శ్లో॥ నైవతస్యకృతేనార్థో నాకృతేనేహ కశ్చన
నచాస్య సర్వభూతేషు. కశ్చి దర్థవ్యపాశ్రియః 3-18

అనగా, తనయందే తాను తృప్తిచెందియున్న జ్ఞానికి పని చేసినను చేయకున్నను దుఃఖము, లేక ప్రతిబంధకము లేదని చెప్పినాడుకాబట్టి మేము పనిచేయనక్కరలేదని అతడు వాదించును. ఈవాదము కేవలము వంచనతో కూడినదనియే మా అభిప్రాయము. ఎందుచేత ననగా జ్ఞానికి లోకకార్యములు చేసినను చేయకున్నను ప్రతిబంధకముండదని పై శ్లోకములలో నిరూపించి, అందువలన జ్ఞాని అవశ్యము పనులలో పాల్గొనవలసి యున్నదని గీతాకారుడు

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః 3-19

అని స్పష్టముగా నిరూపించుచుండగా, ఈ శ్లోకమునకును పై శ్లోకములకును సంబంధములేదని నమ్మించుటకై ప్రయత్నించువారెంతటి వంచకులో పాఠకులే నిర్ణయింపవలసియున్నది. మిథ్యాద్వైతులలో కొందరు మాత్రము పై రెండు శ్లోకములతో ఈ శ్లోకమునకు సంబంధమున్నదని అంగీకరించెదరుగాని ఆ సంబంధమెటువంటిదను విషయములో మాత్రి మీవిధముగా సమర్థించెదరు.

పై రెండు శ్లోకములలో జ్ఞానిపనిచేసినను చేయకున్నను ప్రతి బంధకము లేదని నిరూపించి నీవు మందబుద్ధివి అనగా జ్ఞానాధికారివికాదు కాబట్టి ఆవశ్యము నీవు కర్మలలో ప్రవేశింపవలసినదని గీతాకారుడు అర్జునుని హెచ్చరించినాడని సమర్థించును. అర్జునుడు మందబుద్ధియని ఈ మూర్ఖులు కల్పించినదేగాని గీతాకారుడట్లు చెప్పలేదు. ఉదాహరణ కీశ్లోకమును చూడుడు.

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీమతా
మాశుచస్సంపదం దైవీమభి జాతోఽసిపాండవ. 16-5

అనగా నీవు దైవీ సంపత్తులో జన్మించినవాడవుకాబట్టి నీవు మోక్షార్హుడవేనని స్పష్టముచేసి యున్నాడుగదా? మరొక్క ఉదాహరణను చూడుడు.

శ్లో॥ ఇతితేజ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరంమయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసితథాకురు. 18-63

అనగా రహస్యములలోకెల్ల అత్యంతరహస్యమైన జ్ఞానమార్గమును నీకు చెప్పితిననిగదా నిరూపించుచున్నాడు? యింతస్పష్టముగా గీతాకారుడు అర్జునునిగురించి నీవు దైవాంశము గలవాడవనియు, ప్రియమైన భక్తుడవనియు, రహస్యములలో కెల్ల రహస్యములను నీకు చెప్పితిననియు స్పష్టము చేయుచుండగా, అర్జునుడు మందాధికారి కనుకనే కర్మలలో ప్రవేశ పెట్టబడినాడనియు జ్ఞానులమైనమాకీలోకముతో సంబంధము లేదనియు, వ్యాఖ్యానించు వారెంతటి పగటిబొంగలో ప్రజ్ఞావంతులే నిర్ణయింపవలసియున్నది.

అంతయూరమేల! నానావిధ జీవసముదాయములతో గూడి ప్రత్యక్షముగ కనిపించునదేగాక తన బ్రతుకునకే మూలాధారమైన జగత్కార్యములలో పాల్గొనక యెవ్వరుగాని ఎట్లు జీవించగలరో మన మిథ్యాద్వైతులే

సమాధానము చెప్పవలసియున్నది. ఒకవేళ వీరి వాదమునే నమ్మి వీరి వలెనే కోటి సమాజముకూడ కార్యకలాపములలో పాల్గొనకపోయినచో, సమాజమునకుగాని, వీరికిగాని, జీవనాధారమేమిటని మేము ప్రశ్నింపు చున్నాము. అట్టి పరిస్థితియే తటస్థించిననాడు భస్మాసురుని వరమువలె వీరిచే కల్పించబడిన మిథ్యాద్వైతవాదమే వీరి బ్రతుకును తుడిచిపెట్టుకొని పోవుననుటలో సందేహమేముండును ? ఈ పరిస్థితి నెదుర్కొనవలసి వచ్చునని మిథ్యాద్వైతులకు తెలియకపోలేదు. ఈ పరిస్థితిని సమర్థించు టకై తన మిథ్యాద్వైత సిద్ధాంతమునకు రెండు నాల్కలను కల్పించి అజ్ఞానులకు జగత్తు కలదని ఒక ముఖములోను, జ్ఞానులకు జగత్తు లేదని మరొక ముఖముతోను ప్రచారము చేయజూచి నాడు. కాని ఈ మోస మెంతోకాలము నిలువలేదు. జ్ఞాన-విజ్ఞానసహితముగ నడచుకొనువాడే జ్ఞాని యనువాద మీసోమరికి యెటుసైనసరి. ఈపరిస్థితినుండి బయట పడుటకై మరొక తప్పుడువాదమునుకూడ ప్రచారములో పెట్టినాడు. అతనివాద మిది.

పామరులకు సైతము సులభముగ అర్థమగుటకై జీవేశ్వరులనే కృష్ణార్జునులనుగకల్పించినారనియు, నిజమునకు జగత్తూలేదు, కృష్ణార్జును లూలేరు, కురుక్షేత్రమూలేదని ప్రచారము చేయ సాగినాడు. ఆహా! స్వార్థ మెంతకు చాలదు ? కృష్ణార్జునులు ఫలానా చోట ఫలానా ముహూర్తములో జన్మించి నారనియు అర్జునుడు కృష్ణుని మేనత్త కొడుకనియు శ్రీకృష్ణుని కంటె మూడు సంవత్సరములు మాత్రమే చిన్నవాడనియు, ఈనాడు పుణ్య క్షేత్రములుగా పరిగణింప బడుచున్న మథుర గోకుల బృందావన జగ న్నాధ బదరీ కురుక్షేత్రాదులన్నియు ఆనాడు శ్రీకృష్ణుడు సంచారము చేసిన భూములే ననియు, ఆక్షేత్రములలోని భూమిసైత మీనాడు మనలను పవి త్రులను చేయుననియు, ప్రచారము చేయుచు ధనికులైన గృహస్థులను వెంట బెట్టుకొని యాత్రలు చేయు ఈ మిథ్యాద్వైతియే కర్మను చేయవల

యనను సిద్ధాంతము వెనుకొ్కనవలసి వచ్చిన సమయములలో మాత్రము కృష్ణార్జునులు కల్పితపురుషులని వాదించుటకు సిద్ధపడినాడనిన స్వార్థము మానవుని ఎంతటి పశువుగా మార్చగలదో స్పష్టపడుచున్నది గదా ? అందుచేతనేగదా గీతాకారుడు "నాస్తిబుద్ధి రయుక్తస్య, నచాయుక్తస్యభావన" అని చెప్పినది ?

ఇంతటి ఘోరమైన అసత్యమునకు పాల్పడినను అతడు పొందిన లాభ మేమియు లేదనియే చెప్పవలసియున్నది, ఎందుచేతననగా, కృష్ణార్జునులను జీవేశ్వరులనిఅంగీకరించినను, దేహములు లేకుండ జీవులును, జగత్తు లేకుండ ఈశ్వరుడును, ఉండనేరరుగదా ? అట్లే దేహములున్నప్పుడేగదా హృదయక్షేత్రము లేర్పడునది ? కాబట్టి వీరెంతటి నీచవాదములకు దిగినను, జగత్తు లేదని రుజువుచేయలేకపోయినారని స్పష్టపడుచున్నదిగదా ?

ఒక్క మిథ్యావైతియే యననేల? గీతమావాదమునే సమర్థించుచున్నదని ప్రతి మతస్థుడును వాదించుటకు వెనుకాడరేమి. నిజమున కానాటినుండి ఈనాటివరకు బయలుదేరిన యే మతసిద్ధాంతమునుగాని, గీత ఉన్నదున్నట్లంగీకరింపలేదనియే మా అభిప్రాయము. యింపని నిజానిజములను తెలుసుకొనవలసియున్నచో వివిధమతసిద్ధాంతములనుగురించి తెలుసుకొనవలసియున్నది కాబట్టి ఆ వివరములనుగురించి పరిశీలింతము.

## మతములు

ప్రపంచములోగల మతములన్నియు పరస్పర విరుద్ధవాదములతో గూడిన మూడువిధములైన సిద్ధాంతములతోగూడియున్నవని చెప్పవచ్చును. అందొకటి ఈ కనిపించు జగత్తున కన్యముగ మరొక శక్తిలేదనువాదము. ఈ వాదమును బృహస్పతి, చార్వాకుడు మొదలగువారు చేసిరి. ఈ కనిపించు ప్రకృతిని నియమించు పురుషుడొకడున్నాడను వాదమును కపిలుడు

మొదలగువారు చేసిరి. కనిపించునది సర్వమూ మిథ్యయని శంకరాచార్యులవారు వాదించిరి. నిజమునకు ఈ వాదములు వేదకాలమునుండి చేయబడుచునేయున్నవని స్పష్టపడుచున్నది. ఉదాహరణకు వేదము ఒక సందర్భములో ఈ విశ్వమునుగురించి "తస్మాదే బ్రహ్మనామరూపమన్నంచ జాయతే" అని వర్ణించినదికాబట్టి నామరూపఓషధులతోగూడిన ఈ విశ్వమునే బ్రహ్మమని చెప్పవలసియున్నదనుభౌతికవాదము బయలుదేరినదని చెప్పవలసియున్నది. అట్లే బ్రహ్మమనువిశ్వపదార్థము శాశ్వతమైనదేననియు, ఈ విశ్వపదార్థమే వివిధజీవులుగా యేర్పడుచు జ్ఞానమును పొంది ఆనంద మనుభవించుచుండుననియు నిరూపించుటకై వేదము "సత్యంజ్ఞానంఅనంతంబ్రహ్మ" అని చెప్పగా శాశ్వతుడు జ్ఞానవంతుడు ఆనందస్వరూపుడైన బ్రహ్మమను దేవు డొకడున్నాడని ద్వైతవాదులు నిర్ణయించుకొనుటకు కారణమైనది. అదేవిధముగా ఈ విశ్వములోని పరమాణువుకూడ బ్రహ్మముకంటె అన్యముగ లేదని నిరూపించుటకై వేదము "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని చెప్పగా బ్రహ్మముకంటె అన్యముగా కనిపించు ఈ జగత్తులేనేలేదని అద్వైతులునిర్ణయించుకొనిరి.

ఈ కారణముగా వేదకాలమునుండి నేటివరకు మతరీత్యా మానవసమాజములో ఐక్యత కలుగలేదుసరిగదా, ఎన్నో మారణహోమములు జరుగుటకుకూడ కారణమైనవని చరిత్ర నిరూపించుచున్నది. అంతమాత్రమేల! యేకఖండమైన భారతదేశము రెండుగాచీల్చబడుటకుకారణమేమిటి? హిందువుసాటి హిందువుని అంటరానివానిగా బహిష్కరించుటలోగలరహస్యమేమిటి? తూరుపుగనో ఉత్తరముగనో తిరిగిగాని ప్రార్థించని హిందువు పడమటగ తిరిగి ప్రార్థించు మహమ్మదీయుని హేళన చేయుట కేల సిగ్గుపడుటలేదు? శైవ వైష్ణవ సాంప్రదాయులేల ఆజన్మాంతర వైరులుగా స్థిరపడిపోయినారు? మతప్రభావమేగదా? యిన్నిమాటలేల! మతములు

మానవుడు పాపమానవుని పచ్చిరక్తమును త్రాగుటకు సైతము సిద్ధపడునట్లు చేసినవనిన అతిశయోక్తి లేదనియే మా అభిప్రాయము.

ఈ విధముగా మానవునకు దైవత్వమును ప్రసాదించుటకై బయలుదేరిన మతములు, మానవుని మానవత్వమునే మంటకలుపుటకు సిద్ధపడిన సమయములో సర్వమతసమన్వయముద్వారా, సర్వమానవ సౌభ్రాతృత్వమును స్థాపించుటకై బయలుదేరినదే గీత. గీత యే మత సిద్ధాంతమునుగాని కాదనలేదు. కాని నాయా మతసిద్ధాంతములలోగల సంకుచితభావములకు సంబంధించినవాదములనుమాత్రము ఎత్తి చూపినది. ఇదే గీతలోగల విశిష్టత. ఉదాహరణకు కనిపించు విశ్వపదార్థమొకప్పుడు సర్వశూన్యమైపోవుననిగాని, లేనిదేవు డెక్కడనుండియోవచ్చి రక్షించు చుండుననిగాని, వాదించు టవివేక వాదమను భౌతికవాదుల వాదమును గీతాకారుడామోదించినాడు. ఈ శ్లోకమును చూడుడు,

శ్లో॥ నాసతోవిద్యతేభావో, నాభావోవిద్యతేసతః
ఉభయోరపిదృష్టోఽన్తస్త్వనయోస్తత్వదర్శిభిః 216.

అనగా లేనిదేనాడును పుట్టనేరదనియు, అట్లేఉన్నదేనాడును నశింప దనియు అంగీకరించినాడు. కాని ఈ విశ్వపదార్థము, భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారమను ఎనిమిది ప్రకృతు లతో కూడియున్నదనియు, ద్రవ్యమును చైతన్యవంతముచేయు సత్తా కూడ ఆ ద్రవ్యములోనే అవినాభావసంబంధముగా ఇమిడియున్నదనియు తెలిసికొనవలసియున్నదని భౌతికవాదిని హెచ్చరించియున్నాడు. ఈశ్లోక ములను చూడుడు.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుఃఖంమనోబుద్ధిరేవచ
అహంకారఇతీయంమే, భిన్నాప్రకృతిరష్టధా. 7-4.

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతింవిద్ధిమేపరామ్
జీవభూతాంమహాబాహో, యయేదంధార్యతేజగత్. 7-5.

ఆదేవిధముగా బ్రహ్మాండ మంతయు ఒకే మూలశక్తికి సంబంధించినదనియు రెండవది లేదనియు వాదించు అద్వైతుల వాదమునుకూడ గీతాకారు డామోదించినాడు. కాని జీవేశ్వర జగత్తులు లేనేలేవని వాదించుట మాత్రము పశుత్వమనియు అట్లువాదించువారు నష్టాత్ములు అల్పబుద్ధులు కౄరకర్ములు లోకనాశనముకొరకే అట్టివారు పుట్టుచున్నారని విందింపు చున్నాడు ఈశ్లోకములను చూడుడు.

శ్లో॥ అసత్య మప్రతిష్ఠంతే జగదాహుర నీశ్వరమ్
అపరస్పర సంభూతం కి మన్యత్కామహైతుకమ్. 16-8.

శ్లో॥ యేతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవన్త్యుగ్ర కర్మాణి క్షయాయ జగతోఽహితా. 16-9.

అదేవిధముగా క్షరస్వరూపమైన ఈ ప్రకృతిని నియమించు పురుషుడను శక్తి ఒకటున్నదనుద్వైతవాదుల వాదమును గీత అంగీకరించినది. ఈ శ్లోకమును చూడుము.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చా క్షరఏవచ
క్షర సర్వాని భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 15-16.

కాని విశ్వపదార్థమునకు వేరుగనేవున్న జీవులు, విశ్వపదార్థము ద్వారా వ్యక్తమగుచుందురను సాంఖ్యుల వాదమునుమాత్రము గీత నిరశించినది. చూడుడు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధః
పరంభావమజానంతో, మమావ్యయమనుత్తమమ్. 7-24.

అనగా నాయొక్క (విశ్వమూర్తియొక్క) యథార్థస్వరూపమును తెలియనేరక విశ్వపదార్థములో నేను (జీవత్వము) లేననియు, పదార్థమునకు వేరుగ నుండి పదార్థముద్వారా నేను (జీవత్వము) వ్యక్తమగుచుందుననియు వాదించుటకు వారిబుద్ధిలేనితనమే కారణమనుచున్నాడు.

గీతాచార్యునివంటి మహాపురుషుడు ప్రతి కక్షిని బుద్ధిలేనివాడని నిందించుట భావ్యమా యని పాఠకులు ప్రశ్నింపవచ్చును. గీతాకారుడు సాంఖ్యులను నిందింపలేదు. గీతావాదమిది. విశ్వ పదార్థము పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహములను ఎనిమిది ప్రకృతులతో కలసి యుండు ననియు, ఆఎనిమిది ప్రకృతులలో నొకటగు అంతఃకరణ రూపమైన బుద్ధి ద్వారా ద్రవ్యము సుఖ దుఃఖముల ననుభవించుచున్నదనియు ద్రవ్యమున కన్యముగ పురుషుడొక డున్నాడనుకొను టవివేకమనియు దానివాదము. అనగా ఎప్పుడెప్పుట బుద్ధిరూప అంతఃకరణ మేర్పడునో, అప్పటప్పుట ద్రవ్యము జీవత్వమునుపొంది, సుఖదుఃఖానుభూతులను పొందు చుండునని దీనిసారాంశము.

ఉదాహరణకు పేడఅను ద్రవ్యముపురుగుగా పరిణమించనివరకును అప్లేగ్రుడ్డుఅనుద్రవ్యము పక్షిగారూపొంద నంతవరకును, శుక్లశోణితములను ద్రవ్యము శిశువుగా పరివర్తన జెందనంతవరకును మట్టి అను ద్రవ్యము చెదలుగా మారనంతవరకును అంతమూరమేల చెమట అను ద్రవ్యము క్రిమిగా మార్పుజెందనంత వరకును, ఆద్రవ్యములు సుఖ దుఃఖాను భూతులను పొంద నేరక అంతఃకరణమేర్పడినంతనే సుఖ దుఃఖముల ననుభవించుచున్నవని సామాన్యునకు సైతము తెలియనిదికాదు గదా? ఈ విధముగా ద్రవ్యమునకు సుఖదుఃఖానుభూతులను కలిగించు బుద్ధిని గుర్తించక ప్రకృతులు యేడనియే నిర్ణయించుకొన్నారు కాబట్టి వారిని గీతాకారుడు బుద్ధిని విడచినవారు లేకబుద్ధిలేనివారని వివరించుటకై చెప్పినాడుగాని వారిని నిందించుటకు కాదని మా అభిప్రాయము.

ఈ విధముగా గీతాకారుడు పరస్పర విరుద్ధ సిద్ధాంతములతో గూడిన త్రిమతవాదుల సిద్ధాంతములలోని అనుసరింపదగిన మరియు నిరసింపదగినవాదములను, వివరించి మూడుమతవాదములలో అనుసరింప

దగిన వాదములను సమన్వయము చేసికొని ఒకే సిద్ధాంతముతో అభివృద్ధి చెందుడని హెచ్చరించినాడు. ఇంతటి విశాలదృష్టితో కూడినది కాబట్టియే గీతాసిద్ధాంతమును గురించి ప్రపంచప్రఖ్యాతి పొందిన స్వామి వివేకానందులవారీ విధముగా ప్రశంసించినారు.

> పూర్వతరములగు శాస్త్రగ్రంథములకును గీతాగ్రంథమునకును గల ప్రభేదమేమి? గీతావైశిష్ట్యమేమి? గీతకుముందు యోగ భక్తి జ్ఞాన సాంప్రదాయములను పూనికతో అవలంబించినవారు లేకపోలేదు. కానివారు పరస్పరములైన వైషమ్యమును వహించి స్వమతశ్రేష్ఠతను యుపపాదించుచు వచ్చినారేగాని ఎట్టిసమన్వయప్రయత్న మొనర్పరైరి. గీతాకారుడే ఈ సాంప్రదాయముల నన్నిటినుండియు ముఖ్యములను విషయములనుగ్రహించి గీతాసూత్రమున గూర్చెను".

ఈ ప్రశంసనుబట్టియే గీతా సిద్ధాంతముయొక్క ప్రత్యేకత స్పష్టపడుచున్నదిగదా? అంతేకాదు. గీతా కారుడు త్రిమత వాదుల సాధనలను కూడ సమన్వయము చేసి చూపినాడు. భౌతికవాదులు చెప్పుచున్న కృషి చేయకపోయినచో ఆహారము లభించనేరదు కాబట్టి, జ్ఞానికృషి చేయవలసినదేననియు, అట్లే దైవవాదులు చెప్పుచున్న ఉపాసన అనగా ఏకాగ్రతను సాధించకపోయినచో, బుద్ధిసమత్వమును పొందనేరక చంచలుడై పోవుననియు, అదేవిధముగా బ్రహ్మజ్ఞానము అనగా ఒకేఒక ఈ విశ్వపదార్థమునుండియే సర్వులమూ వచ్చినామను జ్ఞానము లభించనిచో, కుల, మత, వర్ణములను పిశాచములు నిర్మూలించబడవనియు, కాబట్టి త్రిమతవాదుల సాధనలనుగూడ సమష్టిగా సర్వులూ ఆచరణలో పెట్టవలసియున్నదనికూడ నిరూపించినాడు. కాని మనమతవాదు లీ సత్యమును అంగీకరించరు, నిజమున కీసత్యమును శంకరాచార్యులవారుకూడ చెప్పియేయున్నారు. ఉదాహరణకీ శ్లోకమును చూడుడు.

శ్లో॥ కర్మాణి చిత్తశుద్ధ్యర్థం, ఐకాగ్ర్యార్థముపాసతే
మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానం, ఇతివేదాంత డిండిమః

ఎవరెంతచెప్పినను సర్వమతసమన్వయ మార్గమునకు మనమత వాదు లంగీకరింపరు. పైగా ప్రతిమతకర్తయు తమ సిద్ధాంతములే దేశమును, దేశ ప్రజలను ఉద్ధరించుటకు తగిన సమర్థత కలిగియున్నవని వాదించుటకు వెనుదీయరు. ఈ మతప్రచారకుల సంకుచితవాదములను గీతాకారుడు గీతలోస్పష్టముగనే నిరూపించుచు వచ్చినారు. గీతాసిద్ధాంత మునసుసరించి అద్వైతుల జగన్మిథ్యా వాదములోని లోపములేమియో ముందు పరిశీలింతము.

# అద్వైతము

అద్వైతమనుపదమునకు రెండవదిలేదనియే అర్థముకాబట్టి, జగత్తురేనేలేదనియు, ఉన్నదొక్కఆత్మేననియు లేక బ్రహ్మమేననియు అద్వైతులువాదించెదరనిచదివితిమిగదా ? ఆత్మతప్ప రెండవదిలేదను వాదమును మేముకూడఅంగీకరించెదము. కాని ఆత్మయననేమియనువిషయములోమాత్రము వారితోయేకీభవింపజాలము. ఆత్మనుగురించి బృహదారణ్యోపనిషత్తు యేమిచెప్పుచున్నదోచూడుడు. "సవాఏష ఆత్మా వాఙ్మయ ప్రాణమయ మనోమయః" అనగాస్థూలదేహమును దానిలోని ప్రాణాదులను, మరియుమనోబుద్ధులను కలసి, ఆత్మయనబడుననిగదా నిరూపించుచున్నది ? స్థూలదేహమును ఆత్మయనజెల్లునాయనుప్రశ్నకు శ్రుతి "అథంహ వైప్రజాపతే రాత్మనో, మర్త్యమాసీదర్థమమృతమ్" "అంతరంమృత్యోరమృతమ్, మృత్యోరమృతమాహితమ్" అనగాద్రవ్యములో మృతమైపోవునది కొంతయు, చైతన్యవంతమైనదికొంతయు, విభాగములేదనియు, ప్రతిపరమాణువుకూడ, అమృతమృత్యువుల అనగాజడచైతన్యముల సమిష్టియనియేగదా నిరూపించుచున్నది? గీతాకారుడుకూడ

ఈవాదమునే సమర్థించినాడని "నసత్తన్నాసదుచ్యతే" అదిసత్తనిగాని అసత్తనిగాని చెప్పుటకు వీలులేనిది.) "మృత్యుస్సర్వ హరశ్చాహం" (మృత్యువునుకూడ నేనే) అనుపదములే స్పష్టము చేయుచున్నవిగదా? ఈవాదమును భౌతికవాదులుకూడ అంగీకరించెదరనుటకు ప్రముఖ మార్క్సిస్టు శ్రీకంభంపాటి సత్యన్నారాయణ (సీనియర్)గారేమి చెప్పుచున్నారో చూడుడు.

> ప్రతివస్తువులోను జీవింపజేసే శక్తి ఒకటీ మరణింపజేసే శక్తి ఒకటని రెండురకాల శక్తులుంటాయి. ఆ రెండింటిమధ్యా నిరంతరము జరిగే సంఘర్షణలవల్ల ఆవస్తువు మారుతూవుంటుంది. అందుచేత నూటికినూరుపాళ్లుజీవించటంగానినూటికినూరుపాళ్లు మరణించటంగాని జరుగుటలేదనిగదా నిరూపించుచున్నారు. (1)

ఈ విషయములో ఐతరేయోపనిషత్తు యేమిచెప్పుచున్నదో చూడుడు.

శ్లో॥ పృథివీవాయురాకాశ ఆపోజ్యోతీం
షేత్యేషవా ఆత్మోక్థమ్ పంచవిధమ్. 11-3-1.

అనగా పంచభూతాత్మికమైన సర్వ ద్రవ్యములును ఆత్మయనియే చెప్పబడుననిగదా నిరూపించుచున్నది? గీతాకారుడు కూడ

శ్లో॥ యథాసర్వగతంసౌక్ష్మ్యా దాకాశంనోపలిప్యతే
సర్వత్రాఽవస్థితోదేహే తథాఽత్మానోపలిప్యతే.

అను శ్లోకముద్వారా పై వాదమునే సమర్థించినాడుగదా? అంత దూరమేల! గీతాకారుడు వ్యక్తిగతముగ తన్నుగురించి చెప్పుకొనవలసి వచ్చినప్పుడెల్లను "ఉద్ధరేదాత్మనాఽఽత్మానమ్" (తన్నుతానే ఉద్ధరించుకొనవలయును) "తదాత్మానం సృజామ్యహమ్" అని అడుగడున ప్రయోగించినట్లు స్పష్టపడుచుండగా ఆత్మయన అవాఙ్మానస గోచరమైనదను వాదము అవివేకవాదము కాదాయని మా ప్రశ్న?

---

(1) గతితార్కిక భౌతికవాదమను గ్రంథమునుండి.

అద్వైతిచేయు మరొక వాదమేమనగా "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అను మహావాక్యముకూడ బ్రహ్మముతప్ప రెండవది లేదని నిరూపించుచున్నదికాబట్టి, జీవజగత్తులు మిథ్యలని అంగీకరింప వలసి యున్నదని వాదువాదించెదరు. వీరికి వేదాంతగ్రంథ పరిచయముకూడ లేదనియే మా అభిప్రాయము. కారణమేమనగా అనేకములుగా కనిపించు ఈ విశ్వమును బ్రహ్మమని చెప్పబడుననియు దేహరూపములోనున్న ఈ ఆత్మలును, విశ్వరూపములోనున్న ఆబ్రహ్మమును ఒక్కటేననియు శ్రుతి "అయమాత్మాబ్రహ్మ" "ప్రజ్ఞానంబ్రహ్మ" "తత్త్వమసి" అను వాక్యముల ద్వారా నిరూపించుచుండగా, బ్రహ్మమన అవాఙ్మానస గోచర మైనదనియు, రెండవది లేనిదనియు వాదించు టవివేక వాదమనుటలో అతిశయోక్తి యేముండును? బ్రహ్మమననేమి యనువిషయములో గీతా కారుదేమిచెప్పుచున్నాడో చూడుడు.

శ్లో॥ జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యజ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాదిమత్ పరంబ్రహ్మ నసత్ తన్నాస దుచ్యతే.

అనగా యేది జ్ఞేయమనబడునో దేనిని తెలుసుకొనిన అమృతత్వ మును పొందునో యేది అనాదియైనదో దేనిని సత్తనిగాని అసత్తని గాని చెప్పుటకు వీలులేదో అట్టి పరబ్రహ్మను గురించి చెప్పెదనువినుము అది అన్నియెడలను కాలు చేతులు శిరములు చెవులు ముఖములు గలది మరియు లోకమంతయు నావరించి యున్నదనిగదా నిరూపించుచున్నది? ఈవిషయములో ఉపనిషత్తులేమి చెప్పుచున్నవో చూడుడు.

"ఏకస్తై నేదంపూర్ణం పురుషేణ సర్వమ్"
(అతడొక్కడై యుండియు జగమంతయు నావరించెను)
"భోక్తా భోజ్యం ప్రేరితారం చ మత్వా
సర్వంప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్"

( భుజించువాడు, భుజింపబడుపదార్థము భుజించుక్రియ అను సర్వమూ బ్రహ్మమే)

" ఐతదాత్మ్య మిదగ్ంసర్వమ్ "

( ఈకనిపించునదెల్లయు నాత్మయే )

" జీవో బ్రహ్మైవనాపరః "

( ఈ జీవు డా బ్రహ్మమే)

" బ్రహ్మైవేదగ్ం సర్వమ్ "

( బ్రహ్మము కానిదానివలెనున్న యిదిఅంతయు బ్రహ్మమే )

" ఏకస్సన్ బహుధావిచారః "

( అతడొక్కడే అయ్యు పలువిధములుగ విహరించెను )

" ఏక స్తథా సర్వభూతాంతరాత్మా "

(సకల భూతాంతర్వర్తియైన ఒక్కడే ఆత్మయున్నది.) అనిఈవిధముగా కనిపించు విశ్వపదార్థమంతయు బ్రహ్మమనబడును. లేక ఆత్మయనబడు నని బహుముఖముల నిరూపించుచుండగా జీవేశ్వర జగత్తులే లేవని వాదించువా రెంతటి వివేకులో పాఠకులే నిర్ణయింప వలసియున్నది.

మిథ్యావాదులుచేయు మరొకవాద మేమనగా ఆత్మను యెవ్వరును నాశనము చేయలేరనియు (2-17) ఈ ఆత్మ పుట్టటగాని మరణించుటగాని మరొకప్పుడు లేకపోవుటగాని లేదనియు, అందువలన శరీరములు మార్పు జెందినను లేక నశించినను ఆత్మకేవిధమైన మార్పులేదనియు (2-20,) ఈ ఆత్మను శస్త్రములు ఛేదించలేవనియు అగ్ని కాల్పజాలదనియు వాయువు ఎండింపజేయలేదనియు (2-23) అంతేకాదు: ఈఆత్మయింద్రియములకు కనబడనిదనియు మనస్సుచే సైతము ఊహింప బడజాలని దనియు, (2-25) గీతాకారుడు నిరూపించినాడుగదా యని వారు వాదించెదరు.

పై శ్లోకములలో గీతాకారుడు వర్ణించినది, దేహమును నియమించు దేహియనబడు సత్తాచైతన్యమునేగాని ఆత్మనుగురించి కాదనియు అందుచేతనే ఆ శ్లోకములలో యెచ్చటను ఆత్మయను పదమును ప్రయోగించలేదనియు మా వాదము. ఈ సందర్భములో పాఠకులొక ప్రశ్న వేయవచ్చును. అదేమనగా జీవేశ్వర జగత్తులునశించునవేననియు దేహియనబడు నిత్యసత్యమైన దానినే జ్ఞానిదర్శింప వలసియున్నదనియు తెలియజేయుట కొరకే గీతాకారుడు దేహినిగురించి వర్ణించినాడని ఎందుకు నిర్ణయించుకొనగూడదని వారు ప్రశ్నింపవచ్చును.

మా సమాధానమేమనగా దేహియనబడు అనిర్వచనీయమైనశక్తియే నానా దేహములుగను, విశ్వరూపముగను, రూపొందినదనియు, ఈదేహములతోపాటు విశ్వము సైతము లయించిపోయినను ఆదేహియనబడు సత్తాచైతన్యమున కణుమాత్రమేని మార్పు రాదనియు. అందువలన ఈ యుద్ధములో నేనెవరినోచంపుచున్నానని దుఃఖించు టవివేకమనియు నిరూపించుటకే దేహినిగురించి వర్ణించినాడుగాని జ్ఞానులుదర్శింప దగినదని చెప్పలేదనియు, జ్ఞానులు తెలుసుకొనదగినవని మాత్రమే నిరూపించినాడనియు పాఠకులు తెలుసుకొనవలసియున్నదనియే మాసమాధానము

మిథ్యావాదులలో మరికొందరుచేయువాదమేమనగా గీతాకారుడు జగత్తుకలదని అంగీకరించినది నిజమైనచో "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ" అనగా జగత్సంబంధమైన సర్వధర్మములను పరిత్యజింపవలసినదని యెందుకుహెచ్చరించినాడని వారు వాదించెదరు ఈవాదములో ఎంతవరకు సత్యమున్నదో పరిశీలింతము.

## ధర్మము

దేశ కాల పరిస్థితులనుబట్టి ధర్మములు మారుచుండును కాబట్టి సర్వధర్మములను పరిత్యజించి యుద్ధకార్యములో పాల్గొనవలసినదని హెచ్చరించుటకును, జగత్మిథ్యావాదమునకును, యేవిధమైన సంబంధము

లేదనియే మాఅభిప్రాయము. ఉదాహరణకు శ్రుతి "మాతృదేవోభవ" (తల్లియేదైవము) "పితృదేవోభవ" (తండ్రిదైవసముడు) "ఆచార్య దేవోభవ" (గురువుదైవస్వరూపుడు) అనిగదాచెప్పినది? కాని భారతమేమి చెప్పుచున్నదో చూడుడు.

శ్లో॥ పితాఽఽచార్యస్సుహృన్మాతాః భార్యాపుత్రపురోహితః
నాదండ్యో నామరాజ్ఞోఽస్తియస్స్వధర్మేన తిష్ఠతి.

అనగా తనవంశమునకో, దేశమునకో, జాతికో, హానినితలపెట్టి నచో ఆపూజింపదగిన తల్లినిగాని, తండ్రినిగాని, గురువునుగాని, అతిథిని గాని, అన్ననుగాని, భార్యనుగాని, దండింపవచ్చుననియేగదా నిరూపించు చున్నది? అందుచేతనే వైశేషికులు

"యతోభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః సధర్మః"

అనగా అభ్యుదయ (శరీరారోగ్య) నిశ్శ్రేయసము (హృదయ శాంతి)లేకార్యములవల్లకలుగునో, ఆకార్యమునే ధర్మమనిగదా నిర్ణయిం పుచున్నారు? భారతకారుడుకూడా

శ్లో॥ సత్యస్యవచనం శ్రేయ స్సత్యాదపి హితం వదేత్
యద్భూతహిత మత్యంత మేతత్సత్యంవదేత్

అనగా సత్యముచెప్పుటయే ధర్మమనియు, కాని యేదిసత్యమనగా యేది సమాజమునకు మేలునుసమకూర్చునో అదే సత్యమనిగదా నిర్ణ యింపుచున్నది? ధర్మమునకు స్వరూపమేదను ప్రశ్నకు భీష్ములవారేమి చెప్పుచున్నారో చూడుడు

శ్లో॥ సహిసర్వహితఃకశ్చి దాచారస్సంప్రవర్తతే
తేనైవాన్యఃప్రభవతి సోఽపరంబాధతేపునః

అనగా ఒకఆచారమును ధర్మమని సమాజ మనుసరించుచూ వచ్చు చున్నప్పుడు, మరొకఆచార మంతకంటె ధర్మబద్ధమైనదిగా కనిపించున నియు, సమాజమీరెండవఆచారమునుచేపట్టినచో, దీనికంటె ధర్మమైనదిగా

మూఢపుఆచారము బయలుదేరు ననిగదా చెప్పుచున్నాము? యిదెంతయో అనుభవముతో చెప్పినమాటయనియే నిర్ణయింపవలసియున్నది. ఉదాహరణకు ఒకప్పుడు భారతావనిలో వివాహమర్యాద లేదనియు ఆకాలమున అదే పరమధర్మముగా కనిపించినదనియు కొంతకాలమునకు శ్వేతకేతు వనుఋషి వివాహనిబంధన లేర్పరచినాడనియు అట్లే సురాపానము చేయుట కొంతకాలము ధర్మముగా అంగీకరింపబడినదనియు, తర్వాత శుక్రాచార్యులవారు దానిని నిషేధించుటయే ధర్మముగా నిర్ణయించినాడనియు, అదేవిధముగా చనిపోయిన భర్తయొక్క చితిలో దూకి కాలిపోవుట సతీ ధర్మముగా పరిగణింపబడుచూవచ్చినదనియు, రాజారామమోహనరాయ్ గారికృషితో నా యాచారము దురాచారముగ పరిగణింపబడినదేగాక, యిష్టమైనచో, వితంతువు వివాహమాడుటకూడ ధర్మమని సమాజము నిర్ణయించినదనియు, చరిత్ర నిరూపించుచున్నదిగదా ?

దీనినిబట్టి అసలెంతటిసద్ధర్మమైననూగాని, దేశకాలపరిస్థితులనుబట్టి మార్పుజెందుననియే మా అభిప్రాయము. ఉదాహరణకు, సమాజాభివృద్ధి కవసరమైనకార్యకలాపములలో పాల్గొననివాడుపాపియనిగదాగీతాచార్యుడు నిర్ణయించినది?(3-16) కాని పరిస్థితులనుబట్టి ఒక్కొక్కప్పుడు సమాజాభివృద్ధి కరమైన పనులలో పాల్గొనకపోవుటయేగాక. సమాజాభివృద్ధి కరమైన ధనధాన్య వస్తువాహనాదులను పాడుచేయుటకూడ మహా పుణ్యమనియే భారతకాలము నిరూపించుచున్నాదుగదా? (1) అంతమాత్రము

(1) శత్రురాజుల దేశములో కొంతభాగము నాక్రమించుకొన్నప్పుడు నాయాక్రమిత ప్రాంతమునందున్న ప్రజలాప్రాంతమునొదలి అవసరపడ్డచో వెళ్లి ధ్వంసముచేయు వెనుకకు రావలసియున్నదనియు. ఎందుచేతననగా ఆవస్తువులు శత్రువులకు చిక్కినచో, వాటితోనే వారు బలపడి మిగిలిన దేశమునుకూడ ఆక్రమించుకొనుట ప్రమాదము మేర్పడుననిగదా? ధర్మరాజుకు భీష్మాచార్యులవారితో చెప్పినది? (శాంతిపర్వము)

పోనేల? గడచిన ప్రపంచయుద్ధములో హిట్లరుచే ఆక్రమింపబడిన భూభాగములోని రష్యన్ప్రజలు చేసిన, దిదేగదా?

అటేవిధముగా దేశకాలపరిస్థితులనుబట్టి ఒక్కొక్కప్పుడు దేశములోని ప్రజలెల్లరుకూడ వారివారి వృత్తిధర్మములనెల్ల పరిత్యజించుట కూడ మహాధర్మమనియే మహాపురుషులు నిర్ణయించినట్లు చరిత్ర రుజువు చేయుచున్నది. ఉదాహరణకు, 1921, 1930, 1932, 1940, 1942, సంవత్సరములలో బ్రిటీష్ప్రభుత్వముపై సత్యాగ్రహసమరము చేయించినప్పుడు మనజాతిపితయైన, మహాత్మాగాంధీగారిచ్చిన సందేశమేమిటి? ఉద్యోగులారా! కార్మికకర్షకులారా! విద్యార్థులారా! మీ మీ వృత్తిధర్మములను వదలి, సత్యాగ్రహసమరములో పాల్గొనుడనియేగదా హెచ్చరించినది? వారెందుకట్లా దేశించినారు? మిథ్యాజగత్తులోని కార్యకలాపములలో పాల్గొనరాదనియా? లేక, ఆతతాయులచేచిక్కిన దేశమును రక్షింపవలయుననియా? జన్మభూమిని రక్షించుటకేగాని, జగత్తు మిథ్యయని కాదుగదా?

ఇప్పుడు నిర్ణయింపుడు? అర్జునుడు యుద్ధవిముఖుడైన ఆ సమయములో శ్రీకృష్ణుని కర్తవ్య మేమిటి? అర్జునునిచే యుద్ధమును చేయించి దేశమును రక్షించుటయా? లేక భీష్మద్రోణాచులవంటి పెద్దలను చంపవలసివచ్చునదని, యుద్ధమును విరమించి దేశమును ఆతతాయులపరము చేయుటయా? యేది కర్తవ్యమో ప్రజ్ఞావంతులే నిర్ణయింపవలసియున్నది?

మిథ్యావాదులుచేయు మరొకవాద మేమనగా ఈ జగత్తునుగురించి కొందరుప్రపక్తులుమిథ్యయన్నను, మరికొందరు క్షణికమన్నను, మొత్తముమీద జగత్తు లేనిదనియే ఆదిశంకరులవారిదగ్గరనుండి విద్యారణ్యస్వాములవారివరకును, బుద్ధునిదగ్గరనుండి నాగార్జునులవారివరకును యేకగ్రీవ

ముగ నిర్ణయించియున్నారనియు, మాకామహాపురుషులే ఆదర్శముగాని మీవంటి కుతర్కవాదుల నెట్లనుసరించెదమని వారు వాదించెదరు,

ఈ వాదము కేవలము పంపసతోగూడినదనియే మా అభిప్రాయము. కారణ మేమనగా జగత్తునకు మూలమేది యను విషయములో క్షణికమన్నను, శూన్యమన్నను, మిథ్యయన్నను, వర్తమానజగత్తు లేదనిగాని. దీనికి సంబంధించిన కార్యకలాపములలో పాల్గొనరాదనిగాని చెప్పలేదనియే మా అభిప్రాయము. ఉదాహరణకు బుద్ధభగవానుడు వర్తమాన జగత్తును క్షణికముగా నిర్ణయించినచో, "బుద్ధంశరణంగచ్ఛామి" "సంఘంశరణంగచ్ఛామి" "ధర్మంశరణంగచ్ఛామి" యని యేల ప్రచారము చేయును? ఖండఖండాంతరములలోని ప్రజానీకమును సైతము ఆకర్షింపగల విశ్వవిద్యాలయమును స్థాపించి శ్రీ నాగార్జునుల వారేల నడిపించెదరు? అట్లే విజయనగరసామ్రాజ్యస్థాపనద్వారా హిందూ ధర్మోద్ధరణ చేయుటకై శ్రీ విద్యారణ్యస్వాములవారేల జీవితమెల్ల కృషిచేయుదురు? అంతదూరమేల! జగత్తు లేనేలేదని నమ్మినచో శ్రీ శంకరాచార్యులవారు ఆసేతు హిమాచల పర్యంతము పర్యటించి ప్రబోధములు చేసినవేగాక, తమ సిద్ధాంతములు కలకాలము నిలచియుండుటకై భారత సరిహద్దులలో నాలుగువైపుల నాలుగు మఠములనేల స్థాపించెదరు? అట్లే వివేకానందరామతీర్థాదులు ప్రపంచమెల్ల పర్యటించి సమాజోన్నతికై వారి జీవితముల నేల బలిపెట్టెదరు? అట్టి మహనీయులీ పరమసోమరుల కాదర్శపురుషులనుటకంటె హాస్యాస్పదమైన వాదము మరొకటుండదనియే మా అభిప్రాయము. అంతదూరమేల! వీరి వాదములే వీరు సోమరులని నిరూపించుచున్నవి. ఉదాహరణకు వీరి వాదము లెట్లుండునో చూడుడు. జగత్తు లేనేలేదట. తనకు అన్యముగ మరొక్కటి లేదట. అందుచేత వారికివారే నమస్కారములు చేసుకొందురట, ఇదే వీరి వాదము. మా అభిప్రాయ మేమనగా పైపదములతో

పాటు మా పొట్టను మేమే తంటాలుపడుచున్నామను పదమునుగూడ చేర్చుకొన్నచో వీరు నిజమును చెప్పినవారగుదురని నా అభిప్రాయము. ఎందుచేతననగా, నా కన్యముగ మరొక్కటిలేదని చెప్పుచునే మరొక ప్రక్క మట్టపల్లి నరసింహస్వాముల కరుణచేతనే నేనింత ఆర్జింపగలిగితి ననియో, తిరుపతి వేంకటేశ్వరస్వాములవారి ఆశీర్వాదముచేతనే నేనింత సంస్థను నడుపుచున్నాననియో, చెప్పుకొనుచు మా యిష్టదైవముయొక్క నిత్యనైవేద్యములకును, అఖండ దీపారాధనలకును. ఎవరెంతెంత సమ ర్పించుకొందురో వారి కంతంత మహాసుఖములు కలుగునట్లు మా యిష్ట దైవము ద్వారా ఆశీర్వాదములను పంపించెదమనియు ప్రచారము చేయు వారు, రామతీర్థులవారు చెప్పినట్లు ఒకప్రక్క శుద్ధాద్వైతమును చెప్పుచు మరొకప్రక్క క్షుద్రదేవతారాధనలు చేయు వీరు "రాజువేషమును ధరిం చిన బిక్షగాండ్రవంటివారనుటలో" అతిశయోక్తి యేమున్నది?

ఒకప్రక్క జగత్తు మిథ్యయని ప్రబోధించుచు, మరొకప్రక్క ఆశ్రమములపేరుతో విశ్రాంతిమందిరములను కట్టించుకొనుటకును, శిష్యుల పేరుతో ప్రచారకులను సంపాదించుకొనుటకును, ఆరాధనలపేరుమీద స్థిరచరాస్థులను ఆర్జించుకొనుటకును. వీరుచేయు విజ్ఞాపనలు. ప్రకటనలే వీరు అద్వైతులశ్రేణిలో చేరినవారో, అనుష్ఠానపరుల శ్రేణిలో చేరినవారో, స్పష్టపడుచున్నవి కాబట్టి. ఎవ రెంత సవిమర్శనలద్వారా వీరి మోసమును బహిర్గతము చేసినను సమాజము బహిష్కరించనంత వరకీ మోసగాండ్రు వారి సోమరి జీవితమునకు స్వస్తి చెప్పరు కాబట్టి వీరికి సంబంధించిన తప్పులను విరమించి, [illegible] గీతాకారు డెంతవరకామోదించినాడో పరిశీలింతము.

# దేవతలు

"ఏకమేవాద్వితీయంబ్రహ్మ" అను హిందూసాంప్రదాయములో

యిందరి దేవుళ్ళను సృష్టించుటకెట్లవకాశము కలిగెననను విషయమును గురించి ముందు పరిశీలింతము. ఒక యంత్రములోగల వివిధభాగములు కూడ ఒకేఒక శక్తితో పనిచేయుచున్నను, వాటి క్రియాస్వభావములను బట్టి, నాయా భాగములు వివిధనామములతో పిలువబడుచున్నట్లే ఈ బ్రహ్మాండమంతయు ఒకే ఒక శక్తికి సంబంధించినదైనప్పటికిని, నాయా భాగములలో పనిచేయు ద్రవ్యముయొక్క గుణ, కర్మ, క్రియాదుల ననుసరించి వివిధనామములతో పిలువబడినదనిగదా శబ్దశాస్త్రజ్ఞుల నిర్ణయము? ఉదాహరణకు ఒక సమయములో వివిధగోళాకారములతోను మరొక సమయములో అణురూపములతోను సంకోచ వికాసములనుపొందు విశ్వపదార్థమును వృద్ధిపొందించుశక్తిని "బృంహతివర్ధయతిప్రజాయితిబ్రహ్మా" అను శబ్దార్థమునుబట్టి బ్రహ్మయనవచ్చుననియు, అట్లే, విశ్వపదార్థమును నియమించు శక్తిని "విశ్వంవే వేష్టివ్యాప్నోతీతివిష్ణుః" అను శబ్దార్థమును బట్టి విష్ణువనవచ్చుననియు, అదేవిధముగా ద్రవ్యమును పరిపక్వమును పొందించు శక్తిని "ఈష్టఇతీశ్వరః" అను శబ్దార్థమునుబట్టి ఈశ్వరుడనవచ్చుననియు, ఆవిధముగనే పై మూడు శక్తులకు కేంద్రమైన అవ్యయ శక్తిని "ఈశ్వరేషు సమస్తేషు పరమః శ్రేష్ఠః పరమేశ్వరః" అను శబ్దార్థమునుబట్టి పరమేశ్వరుడనవచ్చుననియు, అమరము నిర్వచించియున్నాడు కాబట్టి, ఆ యవకాశమును తీసుకొని దేవతలనువారు, కల్పించబడినారని స్పష్టమగుచున్నది. కాని దేవతలనబడువారు అంతఃకరణ కలిగి వ్యక్తిత్వముతో లోకపాలనము చేయుచున్నారని వాదించుట కేవల మవివేకమనియే మా వాదము. ద్వైతవాదుల వాదమిది.

శ్లో॥ అధిష్ఠానం తథాకర్తా కరణంచపృథగ్విధమ్
వివిధాశ్చపృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం 18-14.

అనగా శరీరము, జీవుడు, యింద్రియములు, కార్యములకు సంబంధించిన వస్తువులు, కలిగి ప్రయత్నించువారియొక్క ప్రయత్నములు సఫలీ

కృతమగుటకు అయిదవదిగా దైవము సహాయపడునని చెప్పుచున్నాడు కాబట్టి దైవమొకడున్నాడని అంగీకరింపవలసినదేనని వారివాదము. మా వాద మేమనగా దైవము సర్వస్వతంత్రమైన శక్తిగలదైనచో, మన ప్రయత్నములతో సంబంధములేకనే యెందుకు సహాయపడరాదని మా ప్రశ్న? వారి వాద మేమనగా, మానవులు సోమరులు కాకుండ జేయుటకై మీరు కార్యములను చేసినచో, నేను సహాయపడెదనని చెప్పినాడు గాని, స్వతంత్రముగ సహాయపడలేక కాదని వారి వాదము. ఈ విషయములో గీతాకారు డేమిచెప్పుచున్నాడో చూడుడు.

శ్లో॥ దేవాన్భావయతానేన. తేదేవాభావయన్తువః
పరస్పరం భావయన్తశ్శ్రేయః పరమవాప్స్యథ 3-11.

అనగా మీరు దేవతలకు సహాయపడినప్పుడే (1) వారు మీకు సహాయము చేయగలరనియు, యిట్లొకరికొకరు సహాయపడుచూ, ఉభయులూ అభివృద్ధి చెందుడనిగదా హెచ్చరించుచున్నాడు? దీనినిబట్టియే, దేవతలన, జడశక్తులని, స్పష్టపడుచున్నదిగదా? అంతమాత్రమేల! ఆదేవతల పేర్లనుబట్టియే అవి జడశక్తులని నిర్ణయింపవలసియున్నదని మా అభిప్రాయము. ఉదాహరణ కా ముప్పదిముగ్గుర దేవతలపేర్లను చూడుడు.

ఒక దేవత ఆకాశము, అష్టే వాయువు, అగ్ని. జలము, భూమి, చంద్రుడు, నక్షత్రములు పన్నెండుమంది సూర్యులు (పన్నెండునెలలలో పన్నెండు లక్షణములతో వ్యవహరించును కాబట్టి, ద్వాదశాదిత్యులందురు) యేకాదశ రుద్రులను పదకొండువాయువులు (ప్రాణ,అపాన,వ్యాన,దాన, ఉదాన, సమాన, నాగ, కుకుర, దేవదత్త, ధనుంజయ, జీవాత్మలనునవి) మెరుపులు, మేఘములనేగదా ముప్పదిముగ్గురు దేవతలనునది? యివి

(1) భావించుటన్నను. వృద్ధిచేయుట. పోషించుట. ఆరాధించుట. సంతోష పెట్టుటన్నను ఒక్కటే అర్థము.

జడశక్తులో, లేక వ్యక్తిత్వముగలవివో, పాఠకులే నిర్ణయింపవలసి యున్నది. జడశక్తులను దేవతలు, లేక దేవుళ్ళని ఎందుకు పిలువబడిన వని పాఠకులు ప్రశ్నింపవచ్చును. "దివ్" అను ధాతువునుండి "దేవః" అను పదము యేర్పడినది కాబట్టి "దివ్" అన సత్తా లేక ప్రకాశమని అర్థమున్నందువలన, సత్తాగల ఈ జడశక్తులను దేవతలని పిలువ వచ్చును గనుక, అట్లు పిలువబడినవిగాని, అంతఃకరణతో వ్యక్తిత్వము కలిగియుంటె, మన కోర్కెలను నెరవేర్చు సర్వజ్ఞమూర్తులని, అట్లు పిలువ లేదని మా అభిప్రాయము. ఒకవేళ దైవవాదులు చెప్పినట్లు ఈ దేవతలు సర్వజ్ఞమూర్తులైనచో, నవావారిని పూజించు భారతీయులకు తగిన వర్షమును పంటలను ప్రసాదింపక, ఆ దేవుళ్ళను సరిహద్దులను దాటకొట్టినారని చెప్పబడు రష్యనులకు, చైనావారికి, కొండంత పంటను, వర్షము నేలనీయవలయునని మేము ప్రశ్నింపుచున్నాము. మా వాదమేమనగా జడశక్తులైన, భూమికి, మేఘములకు, తగిన పుష్టిని కలిగించు ఎరువులను, వనములను యేర్పరచుటచేతనే వారికి తగిన ఫలితము లిచ్చుచున్నవని మా వాదము. పై శ్లోకములో గీతాకారుడు చెప్పినదికూడ యిదేగదా ?

దైవవాదులు మరొకవాదమునుకూడ చేయుదురు. అదేమనగా ఉపాసనలద్వారా దేవతల దయకు పాత్రులై అనేకులు సత్ఫలితములను పొందుచున్నట్లు మేము ప్రత్యక్షముగ చూచుచుండగా, దేవతలనువారు జడశక్తులనువాదమును మేమెట్లు నమ్మగలమని వారు వాదించెదరు. మా వాద మేమనగా జడశక్తులైన దేవతల నుపాసించి వివిధలాభములను పొందినంతమాత్రమున వారు సర్వజ్ఞులని నిర్ణయించు టవివేకమనియే మా అభిప్రాయము. ఎందుచేతననగా ఒకడు సూర్యునుపాసించి ఆరోగ్యమును పొందినాడనిన, సూర్యుని విగ్రహమును గదిలోనో మెడలోనో స్థాపించుకొని పూజార్చనలు చేయుటవల్లనే పొందినాడో, లేక రోగ

సంబంధమైన తన అంగములను సూర్యకిరణములందు కేంద్రీకరించి ఉపాసించుటవల్లనే పొందినాడో ప్రకృతి వైద్యుల నడిగిన తెలియును. అట్లే ఒకడు అసాధారణమైన విద్య నార్జించినాడనిన సరస్వతీదేవి విగ్రహమునుఅర్చించుటవల్లనేపొందినాడో,అక్షరరూపములోనున్న సరస్వతిని తన జిహ్వేంద్రియముతో కేంద్రీకరించి ఉపాసించుటవల్లనే పొందినాడో పండితుల నడిగిన తెలియును. అట్లే ఒక రైతు ఎక్కువఫలసాయమును పొందినాడనిన భూదేవికి అర్చనాదుల చేయుటవల్లనే పొందినాడో, తన శక్తిని భూదేవిపై కేంద్రీకరించి కృషిచేయుటవల్లనే పొందినాడో, వారి నడిగిన తెలియును. అంతమాత్రమున మేము విగ్రహోపాసనలకు వ్యతిరేకులమని తలచరాదు. కాని ఉపాసన యన విగ్రహములను షోడశోపచారములతో అర్చించుటనిమాత్రమంగీకరించము. ఏ మహాపురుషుల లేక ,దేవతాశక్తుల శక్తినార్జింపదలచితిమో, వారి ప్రతిమలద్వారా వారి గుణశీలశక్తులయందు మనస్సును కేంద్రీకరించి మననముచేయుటే ఉపాసనయనబడునని మా అభిప్రాయము.మనస్సునుదేనిపై కేంద్రీకరించెదమో దాని శక్తిని పొందవచ్చుననియేగదా మానసిక శాస్త్రజ్ఞులు చెప్పుచున్నది? ఈ వాదమును భౌతిక వాదులు సైత మంగీకరించెదరనియే చెప్పవలసియున్నది. కారణ మేమనగా రష్యన్ప్రజలు, వారి ప్రియతమనాయకులైన లెనిన్, స్టాలినుల మృతదేహములను భద్రపరచి, ఆ మృతశరీరముల ముందు నమ్రులై నిలువబడి ఉపాసించుట యెందులకు? వారిశక్తిసామర్థ్యముల నార్జించుకొనుటకేగదా?

ఈ సందర్భములో ఆర్యసమాజమువా రొకవాదమును చేయుదురు. అదేమనగా, విగ్రహార్చనలు చేయరాదని మేముకూడ అంగీకరించెదమనియు, కాని ఈశ్వరుడొకడున్నాడనియు, యజ్ఞములద్వారా వారిని తృప్తిపరచవలసియున్నదనియు, ఈ సత్యమును గీతాకారుడుకూడ కాదనలేదనియు వారు వాదించెదరు. మా వాదమేమనగా, గీతాకారుడు

త్యాగముద్వారానే అనగా పరస్పరము ఒకదానిశక్తి నొకదానికి అందించుటద్వారానే సృష్టి, నియమబద్ధముగ నడచుచున్నదనియు, అట్లే మీరును పరస్పర సహకారములతో అభివృద్ధి చెందుటే యజ్ఞమని చెప్పినాడుగాని అగ్నిహోత్రములో నేతిని ఆహుతిచేయుట యజ్ఞమని చెప్పలేదనియే మా వాదము. (౩-వ అధ్యాయములోని ౯-వ శ్లోకమునుండి 16 వరకు చూడుడు) ఈ విషయములో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన శ్రీ రామతీర్థుల వారేమి చెప్పుచున్నారో చూడుడు.

వైదాంతికమైన వైదికభాషననుసరించిఏకవచనంలో చెప్పాలంటే, దేవతలంటే ఒకవ్యక్తికి, తేజాన్ని లేక ప్రాణను, యిచ్చేశక్తులని చెప్పాలి. దీనినే బహువచనంలో చెప్పాలంటే విశ్వానికి తేజాన్ని లేక ప్రాణనిచ్చేశక్తులని చెప్పాలి. ఉదాహరణకు, కన్నుఒకవ్యక్తికి వెలుగునిచ్చునది కాబట్టి, ఏకవచనంలో చెప్పాలంటే కన్ను దేహమునకు అధిదేవతని చెప్పాలి. దానినే బహువచనంలో చెప్పాలంటే విశ్వమునకు వెలుగునిచ్చునదికాబట్టి విశ్వమూర్తికి సూర్యుడధిదేవతని చెప్పాలి, అదేవిధముగా సర్వబాహువులలో నున్నసమిష్టిశక్తికి యింద్రుడని సాంకేతికంగా చెప్పబడింది. దేహమునకు యింద్రియములు అధిదేవతలని, యేఅర్థంలో చెప్పబడిందో, బ్రహ్మాండమునకు సూర్యచంద్రవాయ్వాదిశక్తు లధిదేవతలని ఆ అర్థంలోనే చెప్పబడింది. దీనినిబట్టి యజ్ఞంలో దేవతల కర్పణచేయుటమంటే, వ్యక్తిగతమైన తన్ను సమష్టిగతమైన సమాజమునకు అర్పణచేసుకోవటం. దీనినే ఉదాహరణపూర్వకముగా చెప్పాలంటే, తన యింద్రియములలో ప్రతిఒక్కటి చేయు పనియు, తన మేలునకే ఎట్లు చేయుచుండునో, అట్లే తానీ విశ్వశరీరములోని ఒక్క యింద్రియమునని యు, నే నేపనిని చేయబూనినను, విశ్వశ్రేయస్సునకు సంబంధించిన కార్యములనే,

చేయవలయుననియు విశ్వసించి పని చేయటం. యిదే అర్పణము, లేక యజ్ఞము. ఈ విషయాన్నే క్లుప్తంగా చెప్పాలంటే, యజ్ఞము ద్వారా దేవతలను తృప్తిపరచటమంటే, తనహస్తాలతో చేయబడు ప్రతికార్యమును సర్వప్రాణుల శ్రేయస్సుకొరకై అర్పణచేయటం దీనినే యింద్రయజ్ఞమంటారు. అల్లే తననేత్రాల ప్రయోజనాన్ని సర్వప్రాణి లోకాని, కల్పించటమే ఆదిత్య యజ్ఞమని చెప్పబడింది. అల్లే తన మనస్సుయొక్క ప్రయోజనాన్ని అందరి మేలుకు ఉపయోగపడునట్లు చేయటమే బ్రహ్మయజ్ఞం. యిదే వేదాంతం. ఓ హిందూదేశమా! యిది ఆచరిస్తే ఆచరించు. లేదా మరణించు. ఎందుకంటే ఎన్నివిధముల ఆలోచించినా యజ్ఞమనేదానికి మరోపరమార్థం లేదు.

కొందరు యజ్ఞానికి ముఖ్యలక్షణము హవిస్సంటారు. హవిస్సు గాలిని నిర్మలంచేస్తుందనియు, మంచిపరిమళాన్నికూడా యిస్తుందనియు, అందుచేత యజ్ఞాలను విధిగా చేయాలంటారు. నిజానికి యితర పరిమళములవలెనే ఈ పరిమళములుకూడ మన అంతర్భావాన్ని రంజింపజేస్తాయి. యదార్థాన్ని చెప్పాలంటే ఉద్రేకాన్నిచ్చే ఈ పరిమళములు మన శక్తిని తీసుకుంటాయిగాని తిరిగి యివ్వలేవు. హవిస్సునుండి ఆహ్లాదకరమైన వాసన కొద్దిగానే వస్తుంది. ఎక్కువగా వచ్చేది బొగ్గుపులుసువాయువే సుమా? యిది అపాయకరము. ఒకప్పుడు భారతదేశంలో జనాభాకంటే అడవులు ఎక్కువగా వుండేవి. ఆ రోజులలో నేయి మొదలగు పదార్థాలు అగ్నిలో వ్రేల్చటంవల్ల వచ్చిన బొగ్గుపులుసువాయువు సస్యాలకు సహాయపడివుండవచ్చును. కాని యిప్పుడు జనాభా పెరిగింది. కాబట్టి యిప్పటి వాతావరణములో కావలసినంత బొగ్గుపులుసు వాయువుంది. ఇదిమానవులకురోగములనుచేస్తుంది.

ఇప్పుడు ఇండియాకు కావలసినది ప్రాణవాయువు. ఈనాడు ప్రాణులకు పుష్టికరమైన చాలినంత అన్నమును ఉత్పత్తి చేయగలిగితే ప్రాణవాయువు లభిస్తుందనిగదా నిరూపించుచున్నారు?

ఇప్పటికి అరువదిసంవత్సరములనాడే, శ్రీరామతీర్థులవారు పైవిధముగా చెప్పియుండగా, ఈనాటి జనాభానుబట్టి యజ్ఞాలు సుతరాం పనికిరావని వేరుగ చెప్పనక్కరలేదుగదా? ఈ పరిస్థితులలోకూడ, యజ్ఞములు చేయవలసినదని వాదించువారు సమాజమున కెంతటి ఉపకారులో పాఠకులే నిర్ణయింపవలసియున్నది.

ఆర్యసమాజకులు చేయు మరొకవాదమేమనగా. గీతాసిద్ధాంతము లాచరణయోగ్యములైనవేగాని, నేనేకర్తను, నన్నే అర్చింపుమను మాటలు మాత్రము స్వార్థముతోగూడినవనియు, కారణమేమనగా సృష్టినియామకుడు ఈశ్వరుడేగాని శ్రీకృష్ణుడు కాడనియు వీరు వాదించెదరు. ఈవాదమునకు విరుద్ధముగా, శ్రీకృష్ణుడే వైకుంఠవాసుడనియు, ఆయన నర్చించినవారికే వైకుంఠమనియు వైష్ణవులు వాదించెదరు. ఈ వాదములు రెండును అవివేకమైనవేయని మా అభిప్రాయము. మా అభిప్రాయమే కాదు,

# నేనన ఎవరు?

అను విషయములో స్వార్థపరులైన మతవాదులిట్టి అవివేకమైన వాదనలు చేయుదురనియే గీతాకారుడు. " నేనను " ఈ ఒక్క పదమునునుగూర్చి వివరించుటకొరకే గీతాప్రబోధ సమయములో దాదాపు సగముకాలమును ఖర్చుపెట్టినాడు. అంతేకాదు, వ్యాసులవారీ ఒక్క విషయమును పరిచయము చేయుటకొరకే మూడు అధ్యాయములను (9, 10, 11) ప్రత్యేకించినాడనిన శ్రీకృష్ణ వ్యాసభగవాను లీ విషయమున కెంతటి ప్రాముఖ్యత నిచ్చినారో స్పష్టపడుచున్నదిగదా? నేనను పదమునకు గీతాకారుడెటువంటి నిర్వచనము చేయుచున్నాడో చూడుడు.

అర్జునా ! ఎట్లు అంతటను సంచరించు గొప్పదియగు వాయుపు ఆకాశమునందు నిలిచియున్నాడో, అట్లే సమస్తభూతములయందును నేనున్నానని తెలియుము(9-6) సమస్త భూతములు ప్రళయకాలమున నా ప్రకృతియందు చేరగా సృష్టికాలమున మరల నేను పుట్టించుచుందును (9-7) ఈజగత్తునకు నేనేగతిని, భరించువాడను, సాక్షిని, వాసస్థానమును, -ఆధారుడనై యున్నాను. (9-18) మరియు మృత్యువును, సత్తును, అసత్తును నేనే. నేనే వర్షమును వేడిమిని యిచ్చుచున్నాను (9-19).

దీనినిబట్టి సర్వములో ప్రకాశించుశక్తికి పర్యాయపదముగ నేనను పదమును ప్రయోగించినాడో, వ్యక్తిగతముగ తానే దేవుడనని చెప్పినాడో, ప్రజ్ఞావంతులేనిర్ణయింపవలసియున్నది. విశ్వమూర్తికి, పర్యాయపదముగ నేనను పదము నేల ప్రయోగింపవలయునని పాఠకులు ప్రశ్నింపవచ్చును. తత్త్వోపదేశము చేయునప్పుడు విశ్వమూర్తికి పర్యాయపదముగ నేనను పదమును ప్రయోగించెదరని వేదాంతగ్రంథపరిచయస్తులకు తెలియనిది కాదుగదా ? ఉదాహరణకు ముక్కోటి ఆంధ్రముముక్షువుల కభిమాన గ్రంథమైన సీతారామాంజనేయములో శ్రీరాముడు ఆంజనేయునకు తత్త్వో పదేశము చేయుచు విశ్వమూర్తిని గురించి యేమి చెప్పుచున్నాడో చూడుడు.

కం॥ సర్వోపాధిస్థుడనై
సర్వవ్యాపారములు వెసంజేయుచు త
త్సర్వమునందు వెలింగెడు
సర్వాత్ముడ నేన జుమ్ము సజ్జనతిలకా.

కం॥ నేననిన దనువునకు, నభి
మానమునకు నర్థమగు ప్రమాదమువలనం
గాన యివి రెండనర్థము
లౌ నేనన, నేన, కేవలాత్ముడ ననఘా.

ఇంతకంటె ప్రమాణమేమికావలయును? అంతమాత్రమున గీతాకారుడు వ్యక్తిగతముగ నేనను పదమును ప్రయోగించలేదని మా అభిప్రాయము కాదు. అయితే నేనను పదమును యే సమయములో వ్యక్తిగతముగ ప్రయోగించినాడో గీతలో స్పష్టముగనే నిరూపించబడినదని మా వాదము. ఉదాహరణ కీ శ్లోకములను చూడుడు.

శ్లో॥ నమేపార్థాస్తికర్తవ్యం, త్రిషులోకేషుకించన
నానవాప్తమవాప్తవ్యం, వర్తఏవచకర్మణి. 3-22,

ఈ శ్లోకములో నేననుపదమును వ్యక్తిగతముగ ప్రయోగించినాడు కాబట్టియే. నాకు ముల్లోకములలో పొందనిదిగాని. పొందవలసినదిగాని లేదనియు. అయినను నేను సమాజక్షేమముకొరకై నిరంతరము నిష్కామముగ కర్మను చేయుచున్నాననియు వివరించినాడు గదా? ఈ శ్లోకమును చూడుడు.

శ్లో॥ యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వమదర్పణం. 9-27

ఈ శ్లోకమును విశ్వమూర్తి పరముగా చెప్పినాడు కాబట్టియే, నీ శ్రమఫలితములను, నీవు భోగించు భోగములను నీవు చేయు దానములను సమాజాభివృద్ధికొరకై సమర్పించవలసినదిగా హెచ్చరించుచున్నాడు. ఒకవేళ ఈ శ్లోకమునుకూడ వ్యక్తిపరముగనే చెప్పినాడనిన మొదటిశ్లోకములో నేనేమియు ప్రతిఫలమాశించకుండగనే కర్మచేయుచున్నానని చెప్పినవాడే ఈ శ్లోకములో నీ శ్రమఫలితమును నీభోగములను, నాకేకట్టపెట్టవలసినదని చెప్పునంతటి మూర్ఖుడాయని మా ప్రశ్న? ఈ సందర్భములో దైవవాదులిట్లు ప్రశ్నించెదరు

శ్లో॥ పత్రం పుష్పం ఫలంతోయం, యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః 9-26.

అనగా భక్తితో, పత్రముగాని, ఫలముగాని, జలముగాని, నాకు

సమర్పించవలసినదని గీతాకారుడు చెప్పలేదాయని వారు ప్రశ్నించెదరు. దేవునిపేరుమీద కట్నములను, కానుకలను, పూజారులకో, ట్రష్టీలకో, ధర్మకర్తలకో, చెందజేయుట విశ్వనాథుని సేవయని గీతాకారుడు చెప్పలేదు. మానవుడు తనస్వభావానుగుణ్యమైన కర్మలయందు పాల్గొనుచు విశ్వమూర్తికి అనగా సమాజరూపున కా ఫలితమును అర్పించుటే సిద్ధి యని చెప్పినాడు. ఈ శ్లోకమును చూడుడు.

శ్లో॥ స్వేస్వేకర్మణ్యభిరతః సంసిద్ధిం లభతేనరః
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధింవిందతి మానవః 18-45.

ఇంతకంటెఉదాహరణ మేమి కావలయును? గీతాకారుడే యననేల! హిందూజాతికి అత్యంత ప్రీతిపాత్రములై నిత్యపారాయణ చేయబడుచున్న భారత భాగవత రామాయణములుకూడ ఈ సత్యమునే చాటుచున్నవి. ఉదాహరణకు ధర్మజుని అశ్వమేధయాగశాలవద్దకు వచ్చిన ముంగిస, ధర్మరాజులవారితో నీవు అంతులేని ధనధాన్యములను ఖర్చుచేసి లక్షలాది బ్రాహ్మణ్యమునకు నిరతాన్న కనక వస్త్ర దానములు చేసినను, వుంఛవృత్తి (రాలిన వెన్నుల ధాన్యమును యేరుకొని జీవించు వృత్తి) చేత జీవించు సక్తుప్రస్థుడు ఒక్క అతిథికి ఒక్కసారి భోజనము పెట్టిన దానివిలువలో సహస్రాంశముకూడ నీకు పుణ్యమురాదని యెందుకు ఆక్షేపించినది? కష్టార్జితమునుండి ఒక్క ప్రాణికైన సహాయపడుటే మానవుని ముఖ్యకర్తవ్యమని నిరూపించుటకేగదా భారతకారుడీ కథను చెప్పినది? అట్లే, అగస్త్యులవారు భరతుని సైన్యమునకు మంత్రప్రభావముచే దేవతలుకూడ ఆశ్చర్యపడునట్టి విందును చేసినారుగదా? ఆ కథను విస్మరించి, రామునకు శబరి యిచ్చిన ఎంగిలి రేగుపండ్ల కథనే సమాజమింతకాలము ఎందుకు జ్ఞప్తిలో పెట్టుకొన్నది? మంత్ర తంత్రములలో ఆర్జించిన ధనమునకును, కష్టార్జితముతో కూర్చిన ధనమునకును గల వ్యత్యాసమునుగుర్తించుటచేతనేగదా? అంతయేల! రంతిదేవుడు

